# అటక మీద...



నా దగ్గర ఎన్నో బొమ్మలు ఉన్నాయి. అయినా బోర్ కొడుతోంది.



అటక మీదకి ఎక్కాను.

అటక ఖాళీగా ఉంది.
**లేక ఉండిందా?**



ఇప్పుడు నేను ఉన్నాను...



ఎలకల కుటుంబం, పెంకు పురుగుల సముదాయం కనిపించాయి.

హాయిగా పడుకుని, కలలు కనటానికి చక్కటి, ప్రశాంత ప్రదేశం దొరికింది.

ఒక సాలీడు కలిసింది, ఒక గూడును అల్లాం.

ఒక కిటికీ తెరిచాను, అది మరిన్ని కిటికీలను తెరిచింది.



పాత ఇంజిను దొరికితే దానిని బాగు చేశాను.



నేను కనుగొన్నది పంచుకోటానికి ఎవరైనా ఉన్నారేమోనని చూశాను.

... అప్పుడు ఒక స్నేహితుడు కలిశాడు.



ఎప్పటికప్పుడు మారుతూ ఉండి, ఎప్పటికీ అయిపోని ఆటని
నా స్నేహితుడు, నేను కనిపెట్టాం.



అటక మీద నుంచి దిగి, అంతసేపు ఎక్కడ ఉన్నానో
మా అమ్మకు చెప్పాను.
“మన ఇంట్లో అటకే లేదు కదా,” అమ్మ అంది.

అయినా, ఆమెకి ఎలా తెలుస్తుంది?
ఆమెకు నిచ్చెన కనపడ లేదు కదా!



హియావిన్ ఓరాం
*అటక మీద*